# ఉపోద్ఘాతము.

---

ఆర్యవర్యులారా!

సకలలోకములకుఁ దల్లియగు శ్రుతిసతీమతల్లి భయభయభ్రాన్తస్వాన్తులయిన తనపిల్లల నెల్లరఁ గరుణాకటాక్షమున రక్షింపఁగోరి వారివారి యధికారమునకుఁ దగువిధముగా ననేకముఖంబుల నిరతిశయానన్దకన్దమగు మోక్షమునకు సాక్షాత్సాధనమగు జ్ఞానయోగంబును బరంపరాసాధనంబులగు కర్మయోగభక్తియోగంబులును బరమాదరంబున నుపదేశించుచున్నది. అందువలన మనుజులందఱును దమకు రుచించిన మార్గముల నవలంబించి యపవర్గమున కభిముఖులయి మెల్లఁగనుట కవకాశము కల్గుచున్నది. భూతలంబునఁ గేవలజ్ఞానయోగులైన యుత్తమాధికారులు కోటికొక్కరు నూటికొక్కరుగానుందురు. తక్కినవారందఱును మధ్యమాధికారులుగాను మందాధికారులుగానుందురు. కావున వారికిఁ గర్మయోగ భక్తియోగములే ప్రధానంబులయి చూపట్టుచున్నవి. అందునఁ గలియందలి మానవులనేకులు కేవలము మందాధికారులు గావున వారికి ముక్తిసాధనములలోని భక్తియోగమే ప్రధానభూతంబయి కానంబడుచున్నది. పరమార్థంబగు పరతత్త్వంబు నిరుపాధికంబయ్యును సోపాధికంబుగాఁ దక్కమఱియొక్కవిధముగా నారాధింప నశక్యంబగుటంబట్టి భక్తియోగాసక్తిగల కొందఱు నామధేయరూపధేయ మయంబులయి శుభవిధాయకములయిన యుపాధుల నాధారముగఁజేసికొని హరిహరాది దివ్యమూర్తులను భవ్యవచనరచనల సంగీతభంగి ననుసరించి యంతరంగ బహిరంగంబుల నుతించుచు సేవించుచున్నారు. సామవేద నిదానంబై నామరూపాత్మక సప్తవిధ స్వరవర్ణస్వరూపంబగు గానంబు వీణాదిసాధనముఖంబుల వర్తిల్లుచు మార్తాండమండలాంతర్వర్తియగు శ్రీమ

న్నారాయణం బ్రతిపాదించుచున్నది యని యుపనిషద్దేవి జ్ఞానధనుల యుల్లములకుఁజేటి తెల్లముగాఁ దెల్పుచున్నది. మోక్షాపేక్షగల మానవుండభిమానము మాని శ్రీకృష్ణాభిధానుభగవానుఁ జిత్రచరిత్రసూచక చిత్రగానంబుల వినుతింప వలయునని భాగవతము "గాయన్విలజ్జో విచరేదసంగ" అను వచనముచేఁదెల్పుచున్నది. పశుశిశుసామాన్యమునకే చిత్తమునందు సత్వవృత్తింబొడుకొల్పు సంగీతవిశేషంబు భగవద్ధ్యానపరాయత్తులగు వారిచిత్తముల సత్వవృత్తింబొడుకొల్పుట యొకవింతకాదు. పూర్వోక్తమగు నట్టిపరమేశ్వరారాధనంబున మునుమున్ను బాహ్యాలంబనములేక యంతరాలంబనము చేకూరనేరదు కావున నారంభములకు బాహ్యారాధనంబే ప్రధానభూతంబయి కానంబడుచున్నది. ఆయంతరంగబహిరంగోపాసనలఁ జేయునపుడు వైరాగ్యభాగ్యముగల భక్తులు శాంతరసప్రధానగానవచోరచనలఁబ్రశాంతమగు పరమేశ్వరస్వరూపము నారాధించుచున్నారు. రాగాయత్తచిత్తులగు వారు శృంగారరసప్రధానములయిన సంగీతవచనంబులచే వల్లవీవిలాససముల్లాసము నభినయించు శ్రీకృష్ణభగవానుని జగన్మోహనదివ్యరూపమును నుతించుచుసేవించుచున్నారు. అట్టియుపాసన చూపట్టనిచో రాగాభిభూతచేతస్కుల యుల్లంబులు పల్లవించి దైవంబనుమాటయేని పాటింపనేర్చునొక్కా? రాగముతో దైవగానము సలిపిననయ్యది తదధిష్ఠానప్రభావముచే నేనాఁటికేని దైవనిష్ఠను సమకూర్పకమానదు. అగ్నినాశ్రయించిన యయఃపిండంబునదాహకతాశక్తికలుగకమానునా? ఇక్కాలమున నెక్కడఁజూచినం బెక్కండ్రు రాగద్వేషాది దోషదూషితచేతస్కులేగావున నట్టివారికి భక్తిరుచిచూపుట కది పరమయుక్తియని చెప్పనొప్పును. ఇమ్మాట చక్కఁగావిచారింపని వారిమానసమునకు వెక్కసముగాఁ దోఁచిన నది యుపాధిదోషముగాని వస్తుదోషముకానేరదు. తత్త్వజ్ఞానఘనులగు మహనీయుల శ్రోత్రంబులకు శృంగారచరిత్రంబులును బరమార్థప్రతిపాదకములయి తోఁచుంగావునఁ దాదృశరసప్రతిపాదకగానవిశేషంబు పామరులకే యుపకారముగాని ప్రాజ్ఞులకుపకారము కాద

నియమంబులేదు. మున్ను పరమభక్తాగ్రేసరులగు శ్రీనారాయణతీర్థస్వాములవారు శ్రీకృష్ణభగవానుల శృంగారరసభరితసంగీతములతో 'కృష్ణలీలాతరంగిణి' యను గ్రంథమురచించి యనేకముఖంబులస్తుతించి సగుణబ్రహ్మసాక్షాత్కారముం గాంచి తత్త్వనిష్ఠాగరిష్ఠులై జీవన్ముక్తులయి తరువాత విదేహముక్తిం జెందలేదా! వారిజ్ఞానసంపదకాసగుణోపాసన రవంతయే నంతరాయము కలుగఁజేయనేర్చెనా? ఆగ్రంథాంతంబున నుపనిషద్రహస్యముల సంగీతరూపముగాఁ బ్రచురపఱుచుటయే వారిజ్ఞానవైరాగ్యభాగ్యము సూచించుచున్నది. శ్రీజయదేవకవీంద్రుఁడు శ్రీకృష్ణుని శృంగారచరిత్రమును శ్రోత్రపేయముగా "గీతగోవింద" మను పేరిట రచించి యనేకవిధంబుల నారాధించి జ్ఞానధనుఁడై యౌపనిషద్రహస్యములఁ గొల్లఁగా వెల్లడిచేయుచుఁ "ప్రబోధచంద్రోదయ" మను వేదాంతనాటకంబు రచించి తనయంతేవాసినుద్ధరించి బ్రహ్మభావంబు సంపాదింపలేదా! అట్టిగ్రంథంబులమ్మహనీయుల కుపకారమ్ములు కాకపోయెనా? భగవదుపాసనయేవిధముగానైన నుపకారముచేయకమానదు. ఇట్టియభిప్రాయంబు మనంబునఁ బెట్టియే శ్రీమహారాజరాజశ్రీ శ్రీరాజా మంత్రిప్రగడ భుజంగరావు బహద్దరు జమీందారుగారు శృంగారరసప్రచురముగా నీ "గానామృత" మను గ్రంథమును రచించినారు. వారును శాంతరసప్రధానత్వము సూచింపఁదలంచియే యీ పద్యోపసంహారములయందుఁ దత్త్వప్రతిపాదకంబులగు నుతివచనంబుల రచించినారు. శ్రీవారు గోదావరీమండలస్థమగు నేలూరునందునివాసమేర్పఱుచుకొని, లక్కవరము, బయ్యనగూడెము, బిళ్లుమిల్లి, వెల్ల, మున్నగు ప్రదేశముల నేలుచు, సతతము శివాసక్తిం బ్రవర్తిల్లుచు నిగర్వశిరోమణియు, సరసులునై, యాంధ్రభాషాయోషామణిం జేరఁదీసి మిక్కిలి గౌరవనీయులుగా నెన్నఁదగియున్నారు. (1) మార్కండేయశతకము (2) శ్రీహరిశతకము (3) ఈశ్వరశతకమునను శతకత్రయమును, పిదప 'నలనాటకము'ను, రచించిరి. ఇప్పుడు 'శృంగారరస ప్రవాహిని' యను పేర నొక నూతనప్రబంధమును రచించుచున్నారు. ప్రస్తు

# ఉపోద్ఘాతము.

కాలానుగుణ్యముగా వచనప్రబంధముల వ్రాయ నుద్యుక్తులై యున్నారు. వీరి సర్వకార్యములఁ జక్కఁజేయుచు, ఆంధ్రభాషను వృద్ధిపొందించు మార్గముల నెకొల్పుచు, పరమేశ్వరుండు వీరికి దీర్ఘాయు వొసంగుఁగాత! గుణగ్రహణ పరాయణులగు సుధీవరేణ్యులారా! తమరపరభారతీమూర్తులరగుటంబట్టి యీ పుస్తకంబున విస్తరిల్లియున్న చిలుకపలుకులవలన నెంతయు సంతరింతురు గాక. మఱియుం దమరు విబుధశిఖామణులగుటంజేసి యీ భుజంగరాయకళానిధివలన జనించిన యీ గానామృతముం జదివిచూచి పరితృప్తిఁవహించి నా యిప్పలుకులఁ గుప్పలుకుప్పలుగా నుప్పతిల్లుచున్న తప్పులన్ని యుక్షమించి కటాక్షింపవలయు నని ప్రార్థించుచున్నాఁడను.

ఇట్లు భవద్విధేయుఁడు,

నందిరాజు - చలపతిరావు.





శ్రీ

# కృతినాథస్తుతి.

---

## శ్లోకము.

శ్రీమద్ధ్యాయామిమిథ్యాచకచకవిరచచ్చైత్యసత్యస్వరూపమ్।
హృద్యంసన్మానివేద్యంశ్రుతిమహితసతీభాగ్యసౌభాగ్యకన్దమ్।
సిద్ధంసర్వానువిద్ధంపరమశివమయంభవ్యదివ్యప్రకాశమ్।
మార్కండేయేశ్వరాఖ్యంనతజనసుఖదంభాగధేయంమదీయమ్॥

శ్రీరస్తు.

# గానామృతము.

## శ్రీమార్కండేయస్వామినే నమః.

### శ్రీకృష్ణస్తుతి.

2. ఉ॥ శ్రీవిలసిల్లు నే విభుని - చిత్రచరిత్రలనెల్లఁ దత్త్వవి
ద్యావిశదాత్ములౌ మునిజ - నాధిపులౌపనిషద్రహస్యముల్ ।
భావనచేసి చేసియుప - వర్గ నిరర్గళపూజ్యరాజ్యల ।
క్ష్మీవిభవంబుఁ దాల్తురల - కృష్ణుఁబరాత్మునిన్భజించెదన్ ॥

### కృష్ణస్తుతి.

3. జంఝూటిరాగము: ఆదితాళము.

పల్లవి. శ్రీలా మునిజన-పాలా భవ భయ
వేలానతసుర-సాలా సుశీలా॥

2. రామాకలుషవి-రామా జగదభి
రామాఘనసుఖ-ధామా సుధామా॥ శ్రీలా॥

3. ధీరామహిమగ-భీరామహితవి
చారాసదవన-సారావతారా॥ శ్రీలా॥

4. గోపాలకకుల-దీపాయితఖిల
పాపానుకహార-శాపాగ్నిరోపా॥

5. శృంగారసురుచి-రాంగాసరసభు
జంగాధిపసద-పాంగానుసంగా॥

---

## సరస్వతిప్రార్థన.

### 4. హిందుస్థాని కాపీరాగము. ఆదితాళము.

పల్లవి. నలువరాణి-వాణీ-అలినీలవేణి॥

1. సురుచిరవాణీ-భరణపగాణీ
సరసిజపాణీ-పరమపురాణీ॥

2. వరగణపేటీ-దురితకవాటీ
యరిగిరికోటీ-హరశతకోటీ॥

3. శ్రుతిశతభూషా-శ్రుతిహితభాషా
నతకృతపోషా-శ్రితనుతవేషా॥

4. విమలచరిత్రా-కుమతిలవిత్రా
కమలసునేత్రా-సుమసమగాత్రా॥

5. వినుతశుభాంగా-మనుఘనరంగా
వినతభుజంగా-వనసదపాంగా॥

---

## శివప్రార్థన.

### 5. హిందుస్థాని కాపీరాగము: ఆదితాళము.

పల్లవి. శివదైవమేవసేవే॥

1. మణిమయభూషణమణిభూషణదివ్యభవ్యకరణా॥ శివ॥
2. రణజయమానకామగణసమ్యరమ్యచరణా॥ శివ॥
3. నుతిపరమతిసురపతిపూజ్యరాజ్యభరణా॥ శివ॥
4. పాపమునగపవనసుపర్వగర్వహరణా॥ శివ॥
5. శుభకరమిభవాదనభయాత్మకాత్మకిరణా॥ శివ॥
6. త్రిభువనవిభుమినభుజంగశృంగశరణా॥ శివ॥

---

## గణపతిప్రార్థన.

### 6. జంఝూటిరాగము. ఆదితాళము.

పల్లవి. శరణురా గణరాజరారా
పరా వరా వరావరా॥

1. నతజనపోషా—సంతతఘనదోషా
ప్రమథాధీశా—నుతశేషా॥ శరణు॥

2. చరణసరోజా—ధీరమణిపూజా
కర రాజాజా—సురభూజా॥ శరణు॥

3. దురితలవిత్రా—పరమపవిత్రా
సురమిత్రా—హరపుత్రా॥ శరణు॥

4. అనుపమవిద్యా—ఘనమునిహృద్యా
యమనవాద్యా—మునవేద్యా॥ శరణు॥

5. పరమశుభాంగా—దరముశుభాంగా
ఘనగానాంగా—పరభంగా॥ శరణు॥

# స్వరసాహిత్యములు.

## 7. బిళహరిరాగము : ఆదితాళము.

గాపాధప మగరిగరిస సధసారి–

బాలామణి బిగికవుఁగిలి విడఁజాలి–

గారిసాస నిధసరి గాపా–

జాలిమాలి కనుఁగొనవేరా! –

ధపధాసా–రిసరీగా–

వినవోరా! – యనువోరా!

మగరిసనిధపమగరి॥

కినుక యిటుచనునఁటర॥

1 ధపమగరీ–పమగరిసా–

సతియనెరా–గతియనెరా–

నిధసరిగపధ సాని–

సతి, కుటిల గతి నీకు–

ధగరీసనిధప మగరి॥

వ్రతమా? మదికఱుగదుర? ॥

2. గగరిగాస–రిరిసనీధ–ససరిరి–

బెదరువారి–పొదలమారి–పరుగిడు–

గగపమాగ–గరిగగధపధా–

సుదతిఁజేరి–మదనుఁడవయుఁడై–

గగపధాప–ధధసనీధ–గరిసరి–

మదముమీఱి–మోదముమారి–తెఱలెదు–

# గానామృతము.

సనిధాప-ధధపపామ-గరిసరి॥

ప్రవరమేటి-పదనునూరి-గురియిడె॥

3. ధాపమగగపా-ధపా-

మంగళమిఁకనం-గనం-

మగరిగారిసనిధరీ-గరీసనిధపా-ధస-

గన,భుజంగశయభుజం-గపుంగవశుభం-కర-

పధసరిసారిస

యశులకురంగట,-

సరిగప గాధప-

చిలుకలచెంగట,-

పమగరిగాధపసా-

కొలఁకులముంగిటఁ,దా-

సరీరి-సగాగ-

నలంగి-నలంగి,

సరీరి-సనీని

తలంగి-తొలంగి,

ధపాప-మగాగ-

మలంగి-మెలంగి,-

రిసారి-గపా-

కలంగె-నురా.-

ధపమగరిసా-గరిసనిధపా-

మరులుకొనెరా-మరలఁజనురా?-

ససా-పపా-సపా-ససారీ॥

పరా-కురా-బిరా-నరారా॥

# స్వరసాహిత్యములు.

---

## 8. హిందుస్థాని కాఫీరాగము రూపకతాళము.

స్వ॥ సా ని ధ నీపమ గారి సా –
సా॥ సా ర స లోచన వే చె రా–
స్వ॥ నీ గారి మాపా నిని॥
సా॥ వే మారు నీ రాకకు॥

1. సారి గరిసనిధనీ–పాధ నిసనిపమగా
కోరి వలచినదిరా–మారుసతికిఁ బ్రలి రా
రీ గమ గరిసనిసా–నీసరి గరిసారిమపని॥
చేరికవుగలిడరా–యేరిని మదిఁగోరదుచెలి॥

2. మాపమ గరిసరి గమపమా–
రాజ వ దనయెదనువలరా–
పధనిసపసనిని పమా–
జుముదముకదురశర రా–
ప ని స రి గ రి స ని ప మా–
జెఁబఱుప బెద రి ని జ రా–
గరిసని పనిసరి గ మా–
జవని ని నుశరణ నెదా–
గరిగ మా–నిధప మా–
జగతి రా–జ గోతి రా–
సనిపమ గ రి మ సని॥
జనవర మనపవ్వుర॥

# గానామృతము.

3\. సా రి గ మ రి గ స గ రి-

ఆమగువ నగవు మొగ-

స ని ప స ని ప మరి గమ గరి-

మల క లువ లచెలి గెలిచెడు-

సా ని ప-

నా చె లి-

రి గ మరి మపని మప ని ధ ని-

సొగ సుఁగ ములుతొఁగ ల మిగులు-

స సా రి గ రి స ని నీ-

మ రా ళి గ మ న సు మా-

ప పా ధ ని ధ ప మ గా-

ఝ రా ళి చి కు ర సు మా-

రి రీ గ మగరి ని సా-

వ రాల తరువుసుమా-

ని నీ ప ని సగరీ మప ని స రిగని సరిప నిసమపని-

క డా ని మి సి మిడాల్ దె లుపు బ లుపుజిగిబిగిఁగొను చనులు-

సని పమ గరిమ ప ని ధ ని స-

ప సి డి క డ వ లఁ దె గ డె డుర-

రి గ మ సా-

క లి కి రా-

ధ ని స పా-

చి లు క రా-

రి గ మ సా-

న త భు జం-

రి మ ప ని ధ ని॥

గ పతి వినుత॥

---

## 9. కల్యాణిరాగము: ఆదితాళము.

స్వ॥ సా ని ధ రి స ని ధ ప మ గ మపదా-

సా మి చె లి ని ను వ ల చి పి లి చె రా-

రి స ని ధ ప మ - గ మ ప ధ ని॥

స మ య మి ది య - స కిం గ లి యు॥

సా రి గ మ ప మ ధ - స ని ద ప మ ద-

ఆ మెలంత కులంతే-క ల నినుఁగని-

ధ గ రి స-ని ద-రి స ని ద ని॥

క లి య-గఁ జ ని-యు లి కి ప డు॥

1. మా ప ద ప మ-ప ద ప మ గ మ ప ద ని ద:

ఆ ప డఁ తు క-యొ డ లి యొ డు పు న డ క

ద ని స రి స ని ద ప మ ప ద-

వ డు వుఁ దో డ ల బె డఁ గుఁ గ న-

గ మ ప ద ని ద-ప మ గ మ ప ద-

జ డ వ డు గు లు-నె డ ద లు క డు-

ధ ని స రి స ని ద ప ద ని॥

స డ ల సు డి వ డు దురర॥

2. పా మ ద ప మ గ రి-

ని క్కు చ ను లే ప యి-

గా మ రి గ మ గ రి-

నా క్కు లు ప జ చు చు-

సా రి ని స గ గ రి-
చె క్కి లి ప లు మ ఱు-
సా ని ద ని స గ రి-
నొ క్కు చు వ ల పు ల-
పామ-దాప-సాని-రిస-
హోళిఁ-జాలి-కేళిఁ-దేలి-
గ రి సని-రి స ని ద-
కి ల కి ల-న గ వు లఁ-
స ని ద ప-మ ప ద ని॥ సాని॥
గొలుపుచు-సొ గి య ర॥ సామి॥

3. సా ని ధ ని స ని ద పా మ గ రి సా-
శృంగ జూఁడు గ న య ముం గొ న యు ముం-
ధ ని స రి గ మా ప ద ని-
గొ లి పె ర భు జం గ న ర-
పా మదప మ గ-
పుం గ వ వ ర ద-
రి గ మ గ రి గ-పా ధ ని స రి గ-
తాళఁ గ ల దు ర-వే ళఁ గ డ ప క-
సా గ మా ద ని॥ సాని॥
లీ ల నే ల ర॥ సామి॥

---

IO. వసంతరాగము ఆదితాళము.

స్వ॥ సా ని ధ మా గ గ మా-గ మ ధా ద ని॥ సాని॥
చా న-రో వే చ న వే-స కి పా లి కి॥ చాన॥

1. సా రి గ రి స ని ధ నీ-

మా న ము వ ల దిఁ క నా-

ధా ధ ని ధ మ గ రి గా-

మా న ము వి డఁ ద గు నా-

స ని ధ ని ధ మ ధ ని॥

మ న వి వి ను మ న వె॥

2. మా గ మ ధ మ గ రి స ని స రి గా-

ఆ మ గు వ బి గువు చనుఁగ వ బల్-

గ రి మ గ ధ మ గ రి స రి-

సొగసుఁ గనఁగ నె ద బి గి-

మ మా గ రి స ధ ధా మ గ మ-

త టా లు న నె ప టా లు మ ను-

నినీధ-ససాని-ధనీధ-మధామ-

తుటారి-మిటారి-నటారి- క టా రి-

గ మ ధ ని॥

యగు బలె॥!

3. సా ని ధ ని స రి గ రి స ని ద ని ధా-

ఆ క లి కి చి లు క ల కొ లి కి సు మా-

గ రి స-ని ధ ని-ధ మ ధ-

వ ల పు-గె లు పుఁ-గొనఁగ:

ని సా రి గ రి స-నీ స రి స ని ధా-

శ లా రఁ గ వి సి-నీ ప ను పు ను దా-

రి స ని ధా - గ రి స దా -

న య ము గా-భ య ము గాఁ-

ని స రి సా ద ధ ని ని-
గో ను భు జం గ వి ను తు-
స స రి గ రి స- ని స రి రి స ని-
ర తు ల కృ తు ల-న తు ల గ తు ల-
ధ ని ధ మ-గ రి స స-
న నఁ గి యుఁ-బె నఁ గి యు-
ని ధ మ గ మ ధ ని॥ సాని॥
మ ను పఁ దె లు ప వె॥ చాన॥

---

## కృష్ణలీల.

### II. శంకరాభరణరాగము: అటతాళము.

పల్లవి॥ బంగారు తండ్రియఁటే - యశోదాని - పట్టి కొంటెకాడఁటే॥

1. అంగనరో! యెంత-నంగనాచి వైనీవు-
ముంగిట నేనాడు-బంగరు కెంపుల-
బొంగరములు కన్నా-జంగఁజేసి పైట-
కొంగునరవి కెమ-యుంగనడాచితే! -
దొంగతనము నె-ఱింగినాఁడన-
నంగునకుఁ దెలు-పంగల, నవియొ-
సంగమునియు-ప్పొంగుచునులకె-
చెంగునంగొని-భంగపఱచెను॥ బంగారు॥

2. ఎట్టివాఁడోనిదు-పట్టిచూడవమ్మ-
యెట్టిసైతుమమ్మా-
పట్టపగలందఱి-యెట్టయెదుట నెక్కి-

# గానామృతము.

చిట్టిపూలబంతి-కట్టి నాపయి న్వైచి-
కట్టఁగట్టినది-గట్టి తేలునీవు-
కట్టుచీరెమారె-నెట్టులాక్రొ ! యని-
యట్టెపైఁబడి-పుట్టమూడిచి-
బిట్టుకౌఁగిటఁ-జుట్టికుచములఁ-
బట్టి, బయలున-నిట్టనిలువుగఁ-
బెట్టినప్పుడుఁ-పట్టెచేతుల॥

3. బిత్తరి ! నీవెంత-యొత్తొకాంతునని-
హత్తికౌఁగిటనొత్తెనే॥
అత్తచూచినా-యత్తగారుకోప-
మెత్తియారా ! యోరి ! -మత్తడంతునన్నఁ-
బెత్తనంబునీకు-సత్తువలేదునీ-
చిత్తమురీతి కే-లెత్తిసల్పవాఁడ-
గుత్తకొనినీ-మత్తకాశిని-
క్రొత్తగుబ్బల-మత్తడంచెద-
తత్తధిమితధి-తత్తయనిన-
నెత్తికొనిపటు-గత్తియాడెనె॥

4. దండనునానాధుఁ-డుండఁగావాతెఱ-
గండిపడనొక్కెనే॥
దుండగీఁడువాఁడె-వండురా ? యనఁజనుఁ-
గొండలనడుమన్నుండినూగారను-
నొండునెపమునరా-నుండురాహువుచేర-
కుండఁగముఖశశి-మండలముననధర-

సంపదమునఁగదు-నిండినసుధకు-
గండిచేసితి-వందఁబాపితిఁ-
గొండెమా ? యిది-రండుభుజగని-
భుండుతీరుచుఁ-గొండుతగవనె॥ బంగారు॥

## కీర్తనములు.

12. కన్నడరాగము : ఆదితాళము.

పల్లవి॥ రారామా చెలినేలరా-లేచి-రారామా చెలి॥
మేరా-నీకిదిమంచిదేరా-వేసవయ్యె లేరా-
లోకులునవ్వి పోరా-రారా చెలినేలరా॥

1. మల్లి-విరులఁజాలవెల్లి-విరియఁగఁబాన్పుఁజల్లి-
కుసుమ జడలల్లి-సిసలవిలసిల్లి-త్రుల్లినదిర॥ రారా॥

2. సొక్కి-మారునిధాకఁజిక్కి-యూరనికాకస్రుక్కి-
తీరనిమోహమెక్కి-నేరముసైపమ్రొక్కి-దక్కితినదె॥ రా॥

3. మేని-మెఱుఁగులఁజాలఁబైని-మెఱయఁగఁజేయుదాని-
మెఱుపులమోసపోని-తెఱఁగునుగానవేని-హానియౌనదె॥రా

4. మేల ? -చనవుతడవేల ? కినుకకిదివేళ ?
వినుభుజగపాల ! -ఘనులకిదివాల ? -పోలదుర॥ రారా॥

13. హిందుస్థాని కాఫీరాగము. అటతాళము.

పల్లవి॥ మేలమా ? -సామీ ! యేమిర-మేలమా ?
తాళఁజాలదు బాలరా-మరు-

కేళిఁగూడఁగ వేళరా-తడ-
వేలచేసెదు గోలరా-నీ
లీలనై ననుఁదేటి చూడవు॥

1. పంతమా ?-సామీ ! దానితోఁ-బంతమా ?
చెంతఁజేరవుకోపమా ?-యిసు -
మంతఁజూడవుశాపమా ?-యల-
కంతుఁడే చెర పాపమా!-యీ
యింతినీకయి యెంతసొక్కుర॥

2. మాటరా-సామీ ! నీకు-మాటరా॥
సాటిదానితోఁగూటమా ?-నీ-
పాటివారికివాటమా ? యీ-
బోటికై యీరాటమా-హా !
సూటికాదది మేటివారికి॥

3. యంత్రమా ? సామీ ! యేమిర ?-యంత్రమా
మంత్రిప్రగడ కులేంద్రుఁడు-కవి-
తంత్రపరమానందుఁడు-స
న్మంత్రియా భుజగేంద్రుఁడీని-
మంత్రమెఱిఁగెనుదంత్రమేలర ?

---

## 14. ఆనందభైరవిరాగము : అటతాళము.

పల్లవి॥ మ్రొక్కెద-స్వామినీకు-మ్రొక్కెద॥

1. రేపురమ్మని మాపురమ్మని-తేపతేపకుఁద్రిప్పఁబోకుర
కాపురముఁబాసితినినీకై-యోపఁజాలరమారుబారి

2. నిబ్బరంబుగ నాదు బిగిచను-గుబ్బలంగొని కౌఁగిలింపర।
గొబ్బుననునబ్బబ్బ! యీమరు-దెబ్బలకు నేనోర్వఁజాలర॥ మో

3. మల్లెలును విరిజాజిపూవులు-కొల్లఁగాఁ దెప్పించియుంచితి।
నుల్లమిఁక రంజిల్ల నాపై-చల్లి పాపర కాముతాపము॥ మొక్క

4. చాలుఁజాలు భుజంగరావటు-చాలఁగా నిను సన్నుతించిన।
జాలమిటు సేయంగనేర-యేలరా యీకోప మేలర?॥ మో॥

---

## 15. శుద్ధతోడిరాగము: ఆదితాళము.

పల్లవి॥ ఆపలేని మోహమేమిరా-సామిగ నాపై॥ ఆప॥

1. రేపటికి మాపటికిఁ-గోప మేల దానితోడ।
నాపలేక దానిపొందు-నమృతపుసారమొందు॥ ఆప॥

2. మనసుతీర నొక్కసారి-మారుకేళిఁగూడుమని।
మనవిచేసి వేఁడుకొన్న-మాటలాడని వానికింత॥ ఆప॥

3. ఎన్ని దినములనాఁడు-నన్నుఁజూచి నాఁడవ్వో।
యిన్నినాళ్లు లేని ప్రేమ-యిప్పుడేల కలిగెరా॥ ఆప॥

4. మదన జనక నేఁడు నీదు-మనసు తీరిచెదరా।
ముదము మీఱ భుజంగరావు-సదయతఁ బాలింపఁబోరా॥ ఆప॥

---

## 5. హిందుస్థానీకమాచిరాగము. అటతాళము.

పల్లవి॥ తాళఁజాలరా-యిఁక నేఁ-దాళఁజాలరా।
జాలమేల వెన్నెలలరాజు వలరాజుఁ జేరెనిఁక॥ తాళ॥

1. చనుమానముచే-మనవి చేసినను।
మనమున నెన్నవు-మంచివాఁడవా॥ తాళ॥

2. సరసుఁడంచు నిను-సరసకుఁబిలిచితిఁ।
గరుణఁజేసితాప-భరముతీర్పరా॥

3. మదనుఁడు శరముల-పదనురానూ రెడు।
నదని దేకౌఁగిటఁ-గదియింపఁగనను॥

4. రాజనుతభుజంగ-రాయ కవిదేవ।
భూజమా ! నీకీర్తి-రాజిల్లునిఁకభూమి॥

---

## 17. హిందుస్థానీ భైరవిరాగము - అద్దాతాళము

పల్లవి॥ సరసకురారా-సమయమిదేరా॥

1. పరిపరివిధములఁ-బ్రతిమాలుకొన్నను,।
చిర చిరలాడెదు-సరసుఁడవౌదురా॥

2. అరవిరిపానుపు-లమరిచితి నిరా।
కురువముదవనము-కుదురుపఱచితిరా॥

3. బిగువగుగుబ్బల-పొగురనరవికెలు।
పగులఁగసాగెను-సెగలనుసైపరా॥

5. మనవిచేకొనవేమి-మదనగోపాల।
ఘనమా ! భుజంగరాయ-కవిరాజ పాలా॥

---

## 18. బేహాగ్ రాగము : ఏకతాళము.

పల్లవి॥ లీలమఱువలేనే-వాని-లీల, మఱువలేనే॥

1. ఏలాగు తాళుదు-బాలామణి రో ! నేఁడు।
చాలరతులచేత-సౌఖ్యముఁగూర్చిన॥

2. నిన్నటిరేయినా-కన్నులుమూసితా౯।
దిన్నగానిలుమని-చన్నులఁజేఁబట్టి॥ లీల

3. దూరమునవిల్వ-మారుకేళికిటు।
చేరమనుచునా-జారుపైఁటలాగు॥ లీల

4. తనయులవలెఁదన-దాసులఁజూచుచుఁ।
దనరభుజంగరావు-దాసునేలువాని॥ లీల

## 19. ముఖారి రాగము : ఆదితాళము.

పల్లవి॥ ఓవిరిబోఁడిరో-యోర్వఁగఁజాలనె।
కావవెనన్నుఁగూడి-ఘనరతులఁదేల్చి॥ ఓవి

1. చెమ్మగిల్లునీకు-చమ్ముల నాయెద।
గ్రుమ్ముచుఁగౌఁగిలి-యిమ్మనివేఁడెద॥ ఓవి

2. కళలూరఁగనిఁకఁ-గాముకేళినినా।
కలవరముడుపవే-కాంతరో! మ్రొక్కెద॥ ఓవి

3. లలనామణిరో-వలసినరతులఁ।
గలలోనినుఁగూడి-సొలయుచుంటినే॥ ఓవి

4. రాజబహదరువి-రాజిభుజంగ్రావు।
పూజలఁగైకొను-భూజనప్రియుఁడనే॥ ఓవి

## 20. బేహాగ్ రాగము - ఏకతాళము.

పల్లవి॥ పలుకఁడేమే చెలి-కలికిబోధనవిని॥ పలు

1. కలకాలమునీ-యలుకలెయాటను।
వలపులనువవి-తలఁపులాయెఁగదె॥ పలు

2. వెన్నెలనాబిగి-చన్నులమోపుచు।
నున్నను నామోము-కన్నులఁజూడఁడె॥

3. విరిబంతులుపై-విసరినఁగాంతుఁడు।
మరునికేళిమాట-మనమునఁదల్పఁడె॥

4. రమణిరో! భుజంగ-రావునుతిపయి।
తనిసుమశయ్యను-దార్పఁగఁజూడఁడె॥

---

## 21. హిందుస్థానీ కాఫీరాగము-అటతాళము.

పల్లవి॥ బలె! బలె! ననుఁజేరి-బాసలుచేసి।
కలికిరో! నామాట-తలఁపఁడేరాఁడే॥

1. అత్తరువేలనే-అలగంధమేలనే।
పొత్తుమఱచిపోయి-పురుషుఁడు రాఁడాయె।
చిత్తజుబారినేఁ-జేరితి నేచెలి॥

2. సారెకుఁబయ్యెద-జాఱఁదీయుచువాఁడు।
కూరిమి కౌఁగిటఁ-గోరెడువాఁడేడే।
మారు బారి నెటు-నోపతు నేచెలి॥

3. సన్మానములనెంతో-సలుపుచున్ననాపై।
మన్మోహనునకు-మనసేమిరాకపోయె।
మన్మథుచేఁతలెటు-మాన్పుదు నేచెలి॥

4. రంగనాథుఁడుకవి-రాజభుజంగరావు।
మంగళనుతులన-మ్మఁజిరాకున్నాఁడే।
యంగజుఘాకకు-నాగుదు నేచెలి॥

---

## 22. వసంతరాగము - రూపకతాళము.

పల్లవి॥ ఎంతకాంతమే-వ-సంతఋతు॥ వెంత॥
యింతిరో! యీకనులపండు-వెపుడుఁజూడమే॥ ఎంత॥

1. కలువలదొరరేయి-కాసెవెన్నెల।
చిలుకలుకోకిలలు-చేసెరొదల॥ ఎంత॥

2. మల్లెలుచేమంతులెల్ల-కొల్లలాయెనే।
చల్లనివాయువు వెద-చల్లసాగెనే॥ ఎంత॥

3. ఝుమ్మనుచుపీనులెంతో-సాగియుఁలీలలేఁ।
దుమ్మెదలుపూవులెల్లఁ-గ్రమ్మెనాబలే! ఎంత॥

4. ఇంతవింతయౌటవా-సంతకాలము!
కాంతుఁడౌభుజంగరాయ-కవినుతింపఁడే॥ ఎంత॥

---

## 23. కమాసురాగము: ఆదితాళము.

పల్లవి॥ వగపేలనే? -వలదనవే॥ వగ॥

1. పగవాఁడనే-పతిమారెడు।
వగలాఁడికి-మగఁడేలనే॥ వగ॥

2. తరుణినాతోఁ-పగవుచేసె।
చిరునగవు-చెల్లదనవే॥ వగ॥

3. మానిసికొక-మాటనాడు।
మానినితో-మనకేలనే॥ వగ॥

4. రహిభుజంగ-రావునేలిన।
మహిమవిని-మతిరమ్మనవే॥ వగ॥

---

## 24. బేహాగ్ రాగము : ఏకతాళము.

పల్లవి॥ విరిశరమెటులసైతురా॥

1. మరు(-మురుపుచుమశర-ములను బైగురిం-జోనిపికడు
నురమ్మున(గొలిపెచురు-కుమన॥ విరి॥

2. తల(-పుల(దనుపం(గల-వనుచునినువల-చితినిమది(
గల(-పకురకపు(గిలి-యిడర॥ విరి॥

3. మొగ-తనమెనాబిగి-చనులకనపొగ-రడ్డ(పకయ
సొగ-సుల(గులుక(దగు-నటర॥ విరి॥

4. నతి-సలిపెదను(బతి-మాలెదనుసతి-నేలినను
మతి-భుజంగరావునుతి-సలుపు॥ విరి

---

## 25. హిందుస్థానీ కాఫీరాగము. ఆదితాళము.

పల్లవి॥ రావటరా-రాతిరియింటికి॥ రావ॥

1. భూవలయమునను-బూ(బో(డులులేరా।
యేపనితకైన-నీవిద్యకలదా॥ రావ॥

2. అవసరపడినీపయి-నాసచేసితినని।
చవుకగా(జూడ(గా-నవునటరాయేరా॥ రావ॥

3. చలువపన్నీటితో-జలకమాడింతున।
గలసియీవేళనా-కలవరముడుపరా॥ రావ॥

4. ఘనత-భుజంగరాయ-కవిపోషకుండవని।
వినతులంజేసెద-వేగరారాయింక॥ రావ॥

---

## 26. బేహాగ్ రాగము : ఏకతాళము.

పల్లవి॥ రేపనెదవేమిరా-సామినా-తాపమే మోతెల్పరా॥

1. ఈపూటకైననే-నోపలేరాసామి!।
రేపుమాపటికె-పోపోదానిఁజేర॥ రేప॥

2. ఒక్కనాఁడుండిన-మొక్కమొలచెనో!।
యక్కడనీకున్న-మక్కువతెలిసెలే॥ రేప॥

3. పొందుకోరెదనీవా-సుందరిఁగూడిన।
యందమంటునని-యాసఁజేసియింక॥ రేప॥

4. అందముకాదుగో-విందా! భుజంగరావు।
వందనంబుల-నందుకొనుమింక॥ రేప॥

---

## 27. జంఝూటి రాగము : చాపుతాళము.

పల్లవి॥ ఏమిసేతు-నెటులసైతు-నామనోహరా।
కాముదిరిశరమిటునను-గాసిచేసెరా॥ ఏమి॥

1. నీమనసునన్నుఁజూచి-నీటుకాదెరా।
కోమలులనేఁచనింత-కోరికేలరా॥ ఏమి॥

2 కరముయౌవనంబి దేనీకుఁ-గట్టమిచ్చెద।
విరివిగానధరామృతమున-విందుచేసెద॥

3. ఆరమణివలెనినునే-నాదరించెద।
కరుణఁజేసికఁబవుతీరఁ-గౌఁగిలింపరా॥

4. సారెకుభుజంగరావు-సన్నుతించెరా।
మారజనకనామీఁద-మనసునిల్పరా॥

---

## 28. హిందుస్థాని కాఫీరాగము: ఆదితాళము.

పల్లవి॥ మాయచేసినాఁడే-చెలి-మాయచేసినాఁడే॥

1. వేయసాగెసుమ-సాయకుఁడస్త్రుల।
డాయవెతలుపేఁకఁ-దీయవెయనివాఁడు॥

2. మాయనిపోర మై-జారినచెమటల।
నాయపవీవన-ఛేరబొమ్మనివాఁడు॥

3. చానవోనిముసము-జామయితోఁచెనే।
కానుకఁజేఁబోదుఁ-గాదనకనివాఁడు॥

4. ధరనుభుజంగరావు-దానునిఁబ్రోచిన।
సరసునిమాటలు-వరములౌ! బలెవాఁడె॥

---

## 29. బేహాగ్ రాగము: ఆదితాళము.

పల్లవి॥ ఏరామోసపోయెద-నింతలోనే॥

1. దారిఁదప్పితివో-దానియిలుకాదురా।
యొరకవాఁకిటినాకె-యుంచిపయుండురా॥

2. పరిజేరినా మేను-తడవిచూచెదవు।
మరియాదదక్కదు-మతికోపవతియాపె॥ ఏరా॥
3. ప్రొద్దైనఁజూడవు-పోకెళ్లుపోయెదు।
ముద్దులుకుడిచెదు-మోమాటముంచదు॥ ఏరా॥
4. ననుజేరరాకురా-ననునంటఁబోకురా।
ఘనతభుజంగరావు-కవినుతివినఁబోరా॥ ఏరా॥

---

30. హిందుస్థానీ తోడిరాగము : అద్దాతాళము.

పల్లవి॥ ఏమిరామనోహరానా-కేమితోఁచదాయరా।
కాముబారిఁబ్రోచినన్నే-భామఁగూడినావురా॥ ఏమి॥
1. పండువెన్నెలలువేసఁగి-మెండలయిమండెరా।
బొండుమల్లెసాన్పునిప్పుల-గుండముగనుండెరా॥ ఏమి॥
2. నిన్నుఁగూడువేఁడుకమును-నన్నెఱుఁగనైతిరా।
నిన్నుఁగానలేకపిదప-నన్నెఱుఁగనైతిరా॥ ఏమి॥
3. సుందరిఁబ్రతిమాలితినీదు-పొందునాకుఁగూర్పరా।
యందమయినయిరవుమనకుఁ-బొందుపఱచినానురా॥ ఏమి॥
4. అల్లచెప్పుఁబందిటికి-మెల్లనన్నుఁజేర్పరా।
చల్లఁగాభుజంగరావు-సరసుఁబ్రోచువల్లభా! ఏమి॥

---

31. ముఖారిరాగము : అటతాళము.

పల్లవి॥ సరసకత్తైయని-సకియపలలోఁబడ-సామి-నేనేమందురా॥
1. విరిబంతులచేముంచివి-సీములోననుంచి
మురిపించితేనెతో-మోఁచేయినాకించు॥ సరస॥

2. మందులమారియా-మాయలాడిదాని-

పొందుపాయవేమిరా

యందచెవినహరి-యల్లరివాఁడనె।
సుందరాంగివలపు-సూదిమొనకొలుపు॥

3. పాటలాధరికి నే-పాటిప్రేమకలదో-

మాటికిలంచమురా।

కూటమిఁకనీకుఁ-గూడదు మాడువా।
రాటఁబెట్టిబల్మి-రాటమునొనరించు॥

4. మాటికిమాటికినిన్ను-మమతఁజూపుమన్న-

నేఁటికిదయరాదురా॥

మాటికిశ్రీవెలయు-మంత్రిప్రగడరాజు।
కోటిభుజంగరాయని-బోటిగుణముమఁగు॥

---

## 32. అమీరుకల్యాణిరాగము - అద్దాతాళము.

పల్లవి॥ ఏమిసేతురా-నామనోభవా॥

1. ఏమొకానినిన్ను-నేమఱుతునన్న।
నామనమునందు-నాటియుంటివిరా॥

2. మలయసమీరము-వడగాలియైతోఁచె।
చలువలపన్నీట-చిలువలవిసమయ్యె॥

3. మానినిశరముల-బారికిఁబాల్పడిఁ।
గూరిచినావిధి-క్రూరతఁజూపెరా॥

4. మహితభుజంగ-మాన్యకవిపాలా!।
మహిమతెలిసెరా-మాటలాడరారా॥

---